# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

## ANDHRA RASTRA PRARAMBHA VIDYA

విద్యావిషయిక మాసపత్రిక

సంపుటము 42]  [సంచిక 2

15 మే 1953



సంపాదకులు:

శ్రీయుత మహావాది వేంకటరత్నముగారు బి.ఏ.

వ్యవస్థాపకులు:

శ్రీయుత ఈదర వెంకయ్యగారు.

ప్రకాశకులు:

రామా అండ్ కో॥

H.O. ఏలూరు

# విషయసూచిక

I. M.N. 3766 సం॥ర చందా రు 1—0—0

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

విద్యావిషయిక మాసపత్రిక

సంపుటము 42] ఏలూరు, మే 15 [సంచిక 2




**వివరణము :**

భగవంతుడు మనము చేయు పనులను జూచుచుండును. బిగ్గరగ ప్రార్థనచేసినంత మాత్రమున మోసపోడు. ఆయనను జేరవలెనన్న హృదయము పవిత్రము కావలెను; విశ్వాసముండవలెను. ఆధ్యాత్మిక విషయమున గుణితము, గణితము, పనికిరావు. సరళత – సౌజన్యతలు మాత్రమే రాణించును. డాంబికత యెమాత్రము పనికిరాదు.

**సంకీర్తనము :**

1. అనుక్షణము ఎవ్వరి యాగమనమును నిరీక్షించుచున్నానో అట్టి సర్వాంతర్యామి నా హృదయమును పవిత్రమొనర్చుగాక!
2. అది భగవంతుని స్థిరనివాసయోగ్యమగును గాక!
3. అనుక్షణము ఆయన నాయు సుహాసముఖ ప్రోలును నిరామయముగ నుండును గాక!

స్వామిరామతీర్థ

ఇతడేనమ్మా రామయ్యా! అయోధ్య నేలిన రామయ్యా!
సీతవరించిన రామయ్యా! శ్రితులకు హితుడగు రామయ్యా!
దుష్టులదునిమినరామయ్యా! శిష్టుల బ్రోచినరామయ్యా!
దశరథపుత్రుడు రామయ్యా! దండకకేగిన రామయ్యా!
రామయ్యకు మా దండము లివిగో! రక్షించును మము రామయ్యా!

---

## **ఉపాధ్యాయుల గోడు**

("ప్రేమకోసమై వలలోపడెనే" అనుమాదిరి)

తిండికోసమై మానము వదలిరి పాపం పంతుళ్ళంతా
అయ్యో పాపం పంతుళ్ళంతా ||తిండి||

1. కుటుంబపోషణ భారమని-తమ మానాభిమానాల్ చంపుకొని
ఆకలిబాధను సహించలేకా-ఆలుబిడ్డలతో గంజికి వెళ్ళి ||తిం||
2. పూటకు పూటకు పస్తులెగాసి-జీతాల్ సరిగా అందవని
త్వరలో జీతాల్ అందజేయుమని-పై యుద్యోగుల ప్రార్థించి ||తిం||
3. అప్పులు యిచ్చే మహాత్ములందరు-అస్పృశ్యమైనా రీగాడు
మచ్చుకైనను మర్యాద లేదు-పంతుళ్ళజీవితం అధోగతేరా ||తిం||
4. మాటిమాటికి మహాజర్లు పెట్టి-జీతాల్ పెంచమని ప్రార్థించి
విసిగి విసిగి వేసారితిమిరా-ఆశ నిరాశగ మార్చుకొని ||తిం||
5. పంతుళ్ళబాధలు వినేమహాత్ములు-ప్రజారాజ్యములో లేనే లేరా
ఇప్పటికైనా జీతాల్ పెంచిన-పంతుళ్ళమంతా సంతోషిస్తాం ||తిం||

— రచన: ఎం. యల్. నరసరాజు,
టీచరు - గణేశల్లు

# బడిపంతులు జీవిత సినిమా

పాపము ! ఒక గ్రామ పంతులు భార్య నలుగురితో కలసి సినిమా చూడాలని తలంచి, భర్తనెంతో బాధించింది. "మన బ్రతుకు సినిమాలాగునే వుంది. అట్టినోము నోచుక పుట్టలేదు. మరిగోల చేయ"కంటూ పాపము భార్యను కూకలు వేసేడే గానీ, కంటినుండి వచ్చెడి నీటిధారను తనపై నున్న చింకిగుడ్డతో అద్దుకుంటూ, తలక్రిందికి దించి విచారించుచున్నాడు కృష్ణారావు. ఇంతలో వీధిలోనికి వెళ్ళిన తన కుచేల సంతతి ముగ్గురాడపిల్లలు, ఇద్దరు మగపిల్లలు వచ్చి అందరు సినిమాకు వెళ్ళుట తెలిసికొని తండ్రితో ఒక్కొక్కరు "నాన్నా! సినిమా కెళదామంటూ" చుట్టూ మూగారు. పిల్లల జూచి అతని గుండె కరగిపోయింది, ప్రేగులు వెల్లగిల్లాయి. భార్యనైతే అదమగలిగాడే గాని, తన ముద్దుపాపల నోదార్చలేక యిప్పుడే వస్తానుండమని వీధిలోనికి పోయి, ఒక షావుకారి యింటికి చేరాడు. మన కృష్ణారావు అతివినయముగా షావుకారిని వందనములతో పలుకరించాడు. కృష్ణారావు రాక గ్రహించి ఆరంభంలోనే "ఏంకావలెను; ఏవో చెప్పండి. మా వాళ్ళంతా సినిమాకెళుతున్నారు. వారికి నగలు, చీరలు, బీరువానుండి తీసి యివ్వాలి. యింకా చాలా పని వుం"దని చిరమొరగా అన్నాడు.

"నేనూ అందుకనే వచ్చానండి. సినిమాకు అందరు వెళ్ళుట చూచి మాపిల్లలు గోలచేస్తున్నారు. నలుగురితో పంపిద్దామంటే చేతిలో పైసాలేదు. అందుకే అ...యి... దురూపాయిలు యిస్తే వారపువడ్డీతో జీతాలురాగానే యిచ్చుకుంటా"నని హీనస్వరముతో పలికాడు పాపమా కృష్ణారావు.

అదే తడవున షావుకారు చిరమొరలాడుతూ "నీకేమి బుద్ధిలేదయ్యా! యిప్పుడు సినిమాలకు వెళ్ళకపోతే యేం ప్రమాదమా యేమిటి? మొదట బాకీ క్రింద కొనిజమయివ్వలేదు సరేగదా, యింకొ ఐదురూపాయలిమ్మని అడుగుతున్నావు. మీ అయ్యవార్లకు అప్పిమ్మని ఎవరు చెప్పారు? పైసాలేదు. వెళ్ళు"మంటూ పూటగంజికి నోచుకోని ఉద్యోగికి సినిమాలు, నాటకాలు, జల్సాలు కావాలి. ఆ వెధవ ఉద్యోగాలెందుకు చెయ్యాలో? బజారులో చిన్న కాఫీకొట్టు పెట్టుకోకూడదూ? హాయిగా బ్రతుకవచ్చును." అంటూ గొణుకుకుంటూ ఇంట్లోకి పోయాడు.

యీ మాటలు పాపం ఆ దీనుని చెవులో పడగానే ఎక్కడలేని దుఃఖం ఆవరించింది. యేం చేస్తాడు? కండ్లనీరు తుడుచుకుంటూ షావుకారి యింటిమెట్లు దిగి వీధిలో పడేసరికి తన చిన్ననాటి స్నేహితుడు - తాలూకాఆఫీసు ఎటెండరుగా పని చేస్తూవున్న రామారావు చేతికి రిష్టువాచీ, కాళ్ళకు బూటూ బూటు, నోటిలో సిజరు సిగరెట్టు, కాల్చుకుంటూ చక్కని దుస్తులతో సైకిలు తొక్కుకుంటూ ఎదురై పలుకరించాడు.

"ఏమోయి గురూ! జీవితం సినిమా ఆడుతోంది అందరూ వెళ్లుతున్నారు. మావాళ్ళు కూడా బయలుదేరుతూన్నట్లుంది. నీవు కూడా కుటుంబముతో బయలుదేరకూడదూ?" అని కోరాడు. పాపం కృష్ణారావు రామారావు వేషానికి, తన వేషానికి తేడా పరికించుకుంటూ ఎటెండరుగాయుండి యింత హాయిగా కాలక్షేపం చేస్తున్నాడని ఆలోచనలో పడిపోయి, వెంటనే జవాబు యివ్వలేక తడుముకుంటూ "ఇంట్లో చికాకుగా వుంది రామారావు! నేను రాలే"నని అబద్ధమాడి పోతానని అక్కడ నుండి బయలుదేరాడు.

పాపం; తనభార్యా పిల్లల యీ చిన్నకోర్కె నెరవేర్చలేక పోతినిగదా యని విచారించుచు కృష్ణారావు యిల్లు సమీపించుసరికి తన ప్రాణ మిత్రుడు- ఫారెస్టుగార్డు - గోపాలరావు కనుపించి, అతనిని పలుకరించాడు. పాపం! వీని దగ్గరైనా వెల్లుందేమో యని ఆశకలిగింది కృష్ణారావుకి. యేమేమో కష్టసుఖములు మాట్లాడి. "ఒక అయిదురూపాయలుంటే యివ్వవోయి! మళ్లీ యీనాటికి కిచ్చేస్తా"నంటూ అతిసిగ్గుతో గార్డుగారి నడిగాడు మన అమాయకపు కృష్ణారావు. ప్రాణస్నేహితుడగుటచే పంతుళ్ళ కప్పిచ్చిన వేగముగా యివ్వలేరని తెలిసియున్నా, యేదో అడగ్గానే అయిదు రూపాయిలూ యిచ్చాడు.

ఆ అయిదు రూపాయిలూ జేబులో వేసుకొని, మహా ఆనందముతో యిల్లుచేరేసరికి యింట్లో యేదో గోలవినిపించింది. ఆతురతతో యింట్లో ప్రవేశించాడు. మరేముంది! యింట్లో నీళ్ళిచ్చినది, పాలిచ్చినది, చెరొక రూపాయి యిమ్మని భార్య భవానిని బాధిస్తున్నారు. యిప్పుడివ్వకపోతే రేపటినుండి నీళ్లులేవని నీళ్ళది, పాలుపొయ్యనని పాలది, ఒకటే పట్టుపట్టారు. ఒకప్రక్క నుండి పాపం యేమీ తెలియని తనముద్దుబిడ్డలు "వేగంగా సినిమాకు వెళ్ళాం వేగం వంట చెయ్యమని" అల్లరి పెడుతున్నారు. ఇంట్లో జరుగుచున్న తన జీవిత సినిమా జూచి కొంతవరకు మాటాడలేకపోయాడు పాపం క్రిష్ణారావు. కొసేపటికి తెలివితెచ్చుకొని, ఆగోలపడలేక అప్పుతెచ్చిన అయిదురూపాయిలలో నీళ్ళదానికి, పాలదానికి, చెరో రూపాయిచ్చి తగిలేశాడు. పాపం వంట అయిందా అని భార్య నడుగలేక పెరటికి ఒంటేలుకు పోయినట్లు వెళ్ళి వంటింటి పొయ్యిని చూశాడు. మరేముంది. పొయ్యిలో అగ్నిదేవు డవతరించలేదు. ఇంట్లో భత్యము లేని సంగతి తెలిసికొని, మారుమాటాడక, వీధిలోనికి పోయి మిగిలిన మూడురూపాయిలలో పిల్లలకు, భార్యకు, నేల టిక్కెట్టునకు సరిపోవు పైకము అట్టేపెట్టి మిగతా సొమ్ముతో భత్యపుసామాను తీసికొని యింట్లో భార్య కప్పజెప్పాడు క్రిష్ణారావు.

కొసేపటిలో వంటఅయింది. భోజనాలుచేశారు. నేను యింట్లో వుంటాను. పిల్లలను తోడ్కొని సినిమాకు వెళ్ళమని నేలటిక్కెట్టునకు డబ్బిచ్చాడు. పాపం! పంతులమ్మ భవాని తెలియక భర్తగారిని రమ్మని బాధించింది. కాని చివరకు దమ్మిడీకైనా భర్త దగ్గరలేదని తెలిసికొని, విధిలేక పిల్లలనుతీసికొని యిరుగు పొరుగు వారితో వెళ్ళుటకు సిద్ధపడింది. పాపం! ఉత్తమెడతో ఎలా వెళ్ళటమా యని యేనాడో కొని, తన క్రపెట్టెలో వుంచిన ఉమాగోల్డుకవరింగుచైనును కొద్దిగా బూడిదతో పాలీషు చేసి, మెడలో వేసుకోమని భవానిచేతి కిచ్చాడు మన క్రిష్ణారావు. పాపం భవాని తనకన్న వారిచ్చిన సైనుతాను కట్టుకొని, దిక్కులేని దీనులవలె నున్న తనపిల్లలతోబయలుదేరింది. మనక్రిష్ణారావు గుమ్మము బయటవరకు సాగనంపి, ఇరుగు పొరుగుననున్న తాలూకాఫీసు సుమస్తాగారి కుటుంబముతోను, బజారులో చిన్న కాఫీహోటలుపెట్టి జీవించుచున్న అయ్యారుగారికుటుంబముతోనూ, జతగాచేసిభార్యను పిల్లలను జాగ్రతయని చెప్పాడు. పాపం వారిని సాగనంపెడే కాని తనభార్యాపిల్లల యొక్కయూ తక్కిన ఇరుగు పొరుగువారి యొక్కయు వస్త్రాహారాదుల బాగుగ గమనించి కంటినుండి నీరుకార్చుచు ఇంట్లోనున్న నులకమంచముపై పండుకొని, నిద్రాదేవతను ఆహ్వానించబోయాడు. పాపమెట్లాదేవత ఆదేశించగలదు! నాడు తన భార్యాపిల్లలను సినిమా చూపించుటకు పడిన ప్రయాస, సాహుకారన్న కఠినవాక్యములు, తన బాల్యస్నేహితుడగు ఎకౌండరు యొక్కయు, తనయొక్కయు, జీవితవ్యత్యాసము, ఫారెస్టుగార్డు గోపాలరావు బ్రతుకుకంటె తన బ్రతుకు హీనముగా నుండుట, నీళ్ళుతెచ్చునది, పాలిచ్చునది, ఆడిన కఠినపుమాటలు, కాఫీహోటలు పెట్టి తనకంటె హాయిగ బ్రతుకుచున్న అయ్యారుగారి జీవితము, అప్పుడప్పుడు పూనుచున్న తనయింటి పొయ్యి నిరశనదీక్ష, తనచేతులతో భార్యనువేసుకోమని యిచ్చిన ఉమాగోల్డు కవరింగుచైను, కట్టుబట్టలు, మొదలగు తనజీవిత సినిమాలోని ఘట్టము లన్నియు జ్ఞప్తికి తెచ్చుకొని పరిపరివిధముల దుఃఖించి, కంటినుండి నీరు ఏకధారగా గార్చుచు తనశరీరమును తాను మరచే టైములో నిద్రాదేవత యిదే సమయమని క్రిష్ణారావుపై అవతరించింది.

నిద్రాదేవత అవతరించినా పాపం నిద్రలోగూడ తనకు ఆవేదన విడువలేదు. ఇంతలోగా........

"పుత్రా! నీజీవితము మహాక్లిష్టపరిస్థితిలోయున్నది. నీ పూర్వపు ఔన్నత్య మేమైనదో? నీ ప్రతిభ, నీగౌరవము, నీకున్న అగ్రస్థానము, విక్రమాదిత్య, క్రిష్ణదేవరాయలాది ప్రభువులతోనే పోయినది. ఇప్పుడు నిన్ను తొంగిచూచువా రొకరైననులేరు. నీవు నాడు ఎంతఅగ్రస్థానములో యుండెడివాడవో అంత నీచస్థానములో నేడున్నావు. నాగర్భమున బుట్టిన నీకు యీనాటికిట్టి దుస్థితి వాటిల్లుటకు నేనెంతయో కన్నీరు గార్చుచున్నాను. నా ఔన్నత్యము, నా ప్రతిభ, నా గొప్పతనము, నాతోనే పోయినవి. నా మంచి పెద్దలు నిన్నుబట్టియే యుండును. ఆనాడు నీ కగ్రస్థానముండెడిది. నేను ప్రపంచములో అగ్రస్థానము వహించియుంటిని. యీనాడు నీవు మహాదుర్దశలో యున్నావు. నేను మహాదుర్దశలో యున్నాను. యేనాడు నీకు

మనలపూర్వపు ఔన్నత్యము వచ్చునో ఆనాడు మరల నా ఖ్యాతి నాకు రాగలదు.

నా గర్భమున జన్మించి, నీ భార్యాబిడ్డల పోషించు శక్తి లేక పోయినదా? ఒక సినిమా ప్రదర్శనము చూపుటకు శక్తిహీనుడవైతివా? దౌర్భాగ్యుడా! నిన్ను బట్టియే దేశవైభవము నిలిచియున్నదని ఒక్కనాటికైనా జ్ఞప్తికి రాలేదా! నిన్నటివరకు నీయొద్దనే జ్ఞానమార్జించి, మహోపదవులను సంపాదించి, మహావైభవముగ జీవితము గడుపుచున్నంత మాత్రమున నిన్ను మరచిపోవుటయా? నీ జ్ఞానోపదేశమును బట్టియేకదా వీరు మహోపదవులు, సుందర భవనములు, పలురకముల వస్తువాహనాదులు, అనుభవింప గలుగుచున్నారు. నీవల్ల యింతమేలును బడసి నిన్ను మరచిరా! ఆహా! కాలమహిమ! నాగర్భమునబుట్టి, మహానాయకులమని, దేశోద్ధారకులమని, మాతల్లిని మేము పోషించువారమే సమర్థులమని, పరాధీనవైయున్న నన్ను విడిపించి మహానీచములో నన్నుంచి, నాకీర్తిని ప్రకాశింపజేయునట్టి నాఘనతను దేశదేశముల చాటింపజేయునట్టి, నిత్యకల్యాణము పచ్చతోరణముగా నన్ను వికసింపజేయునట్టి, నిన్ను యీ నీచస్థితిలో దించి, నీకడుపు మలమల మాడ్చి నీ భార్యాబిడ్డలకు కట్టుకొనుటకు గుడ్డయును లేక, స్వల్పకోరికయైనను తీర్చుటకు శక్తిలేక, నీకెట్టి మేలొనగూర్చలేని స్వార్థులనేకులు లంచగొండితనములో మునిగి కోటలు, మేడలు కట్టుకొని సర్వవస్తు వాహనాదు లనుభవించుచు, నన్ను నిన్ను తొంగిచూడక ప్రవర్తించెడి వీరెంతకాలము సిరులతో తూగగలరు? మొత్తముమీద నేను దౌర్భాగ్యురాలను. యింతవరకు యిట్టి మహనీయుల నేనెన్నడు కనలేదే! నాగర్భశోకము మాన్పలేని ఈ పుత్రులు శత్రువులుకారా? నాకు దరిద్రదేవత ఆసన్నమగుటచే యిట్టివారిని బడసితిని. కొద్దిగ ఓపిక పట్టాలి. యీమహనీయు లున్నంతవరకు, వారి కోరికలు తీరువరకు నిన్ను, నన్ను తొంగిచూడరు

నీవు అంతవరకు భార్యాబిడ్డలతో ఏ గంగానదిలోనో, ఏ గోదావరిలోనో పడి ముక్తిబడయుము. నీవంటి మహనీయుల కిచ్చట తావులేదు. ఒక్కక్షణమైనా నిలువకు నామాట విను. యీనీచపు బ్రతుకు నీవు బ్రతుకుటకంటె నేచెప్పినదే నీకు సన్మార్గము. ఛీ! లెమ్ము!! నామాట విను. నీవు, నీ సోదరులు ఎంత సంఘీభావముగా వేడుకొన్నను మరి వీరెవ్వరును తొంగిచూడరు. నీసాయముచే నన్ను ప్రకాశింపజేయు సద్బుద్ధి వీరెవ్వరికి లేదు. అంతవరకు నీకిచ్చట తావులేదు. ఆ ఉన్నదశలో వచ్చినపుడు నిన్ను పిలిచెదనులే. మరి నీవుండకు. నీ భార్యాపిల్లలను చూపు. యేవిధముగనైనా జీవితము బలిచేయుము. నీకు ముక్తివుంది. పో పో." అని గట్టికేకలు చెవిని పడగానే త్రుళ్ళిపడి లేచి గాబరా పడుతూ నలుదెసలు చూచి, ఆశ్చర్యపడ్డాడు. పాపం! మన క్రిష్ణారావు.

కొంతసేపటికి యీదంతయు స్వప్నమనియు, తనకు ఉపదేశించినది మహాతల్లి, జగజ్జనని, లోకమాత భారతమాత యనియు, తలచి, దాని మాటలన్నియు జ్ఞప్తికి తెచ్చుకొని మరి భరించలేకపోయాడు దుఃఖాన్ని. దానితో అతని గుండె ఆగిపోయినది.

పాపం! సినిమా చూచి వచ్చి నిద్రలో మునిగిన అతని భార్యాబిడ్డలు ఉదయముననే అతని మరణము తెలిసికొని మహాగోల పెట్టిరి. తనభర్తకు యథావిధిగా కర్మచేయుటకై నాయింటిలో ఏమియు లేకపోవుటచే వీధిలో ముష్టియెత్తి వచ్చి తన భర్త కళేబరమును దహనము చేయించినది. పాపము! ఆమె యిటుపైన ఎట్లు తనజీవితమును కొనసాగింప గలదు? ఏమియు తోచక పిచ్చెత్తి ఆగమ్యమున తనపిల్లలతో ఎటుపోయినదో మరి కానరాదు. తెల్లవారిన తరువాత ఊరంతా గోలపెట్టినది. ఋణదాతలు క్రిష్ణారావుగుడిసెలో ప్రవేశించి చూచారు. పాపం యింట్లో యేమున్నది? ఒక చీపురుకట్ట, చింకి గుడ్డలతో నిండిపోయిన క్రొత్తపెట్టె, మట్టి వంట పాత్రలు. ఇవన్నియు చూచిన ఋణదాతలు, ప్రజలు, క్రిష్ణారావు జీవితమెలా గడిపాడో యని కంటినీరు గార్చి వారి వారి యిండ్లకు పోయారు.

N B:—(యీరచన ప్రభుత్వమునకు గాని, ప్రభుత్వోద్యోగులకు గాని, మరియెవరికిగాని వ్యక్తిగతముగ విమర్శించితినని భావింపకూడదని ప్రార్థించుచున్నాను. యీనాటి ఉపాధ్యాయుల కడగండ్ల సమస్యను భరించలేక వాటిని ప్రతికొంత్సాహుల ద్వారా విన్నవించుకొనుటయే గాని వేరుకాదు. అందరియెడల గౌరవభావము తప్ప మరి వేరే భావము లేదని మనవి చేయుచున్నాను.)

అభాగ్యజీవి,

పి. ఆమిటి, ది 31-3-53

పట్నాయకుని నరసింహాము, టీచరు - మానేజరు.

# తుదిపలుకు

కాకరపర్తి కామేశ్వరశాస్త్రి: బేసిక్ టీచర్: ఖండవిల్లి.

"బేసిక్ విద్య"ను గూర్చిన వివిధ సమస్యలకు సంబంధించిన విషయములను వ్యాసములుగా యీ పత్రికలో ప్రచురించిన నేను యీ "తుదిపలుకు"తో పూర్తిచేయగలిగినందుకు సంతసించుచున్నాను.

ఇప్పట్టున నా ప్రయత్నము సఫలీకృతమగుటకు తోడ్పడిన సంపాదక మహాశయులకు నా కృతజ్ఞత తెల్పుచున్నాను.

మరియు నా వ్యాసములను చదివి బేసిక్ విద్యను గూర్చి తెలుసుకొనిన పాఠక మహాశయులకు, ఉపాధ్యాయ కేంద్రసంఘములలో చదివించి బేసిక్ విద్యాప్రచారము చేసిన ఇన్‌స్పెక్టర్లు గారలకు, తమ బేసిక్ విద్యాశిక్షణాలయములలో నేటి విద్యార్థులచే చదివింపజేసి ప్రచారముచేసిన ఆయా శిక్షణాలయముల ప్రధానాచార్యవర్యులకును, నేనెంతయు కృతజ్ఞుడను.

నేనీ వ్యాసములు ప్రచురించుటలో గల యుద్దేశ్యమును ప్రథమవ్యాసముననే తెలిపియున్నాను. నా వ్యాసముల వలన బేసిక్‌విద్యకు [illegible] ప్రచారము జరిగినా, దీనియందు విపరీతాభిప్రాయములు గలిగిన వారిలో ఏ ఒక్కరి అభిప్రాయము ఈ విద్యకనుకూలముగా మారినా, నా ప్రయత్నము సఫలమైనట్లే! కారణాంతరములచే ఆ వ్యాసములను వరుసగా ప్రచురింప లేక పోయినందుకు చింతిల్లుచున్నాను.

ఇప్పటికిని యీ శిక్షణ పొందినట్టియు, పట్టభద్రులైనట్టియు, అధికారపదవులు గలిగినట్టియు, పెద్దమనుష్యులు యీ విధానమును గూర్చి కడు వ్యంగ్యముగా, హేయముగా, ఉపాధ్యాయసభలలో చెప్పుచున్నారని విన్నప్పుడు ఆశ్చర్యముతో బాటు విచారమును కలుగకమానదు. అట్లు ప్రచారము చేయుటలో వారికి తప్పులేదనియే చెప్పవచ్చును. ఏలనన దీనియందు విరుద్ధభావములు గలవారికి బలాత్కారముగా యీ శిక్షణను యిచ్చి, దేశముపైకి వదలినచో వారంతకంటె యేమిచేయగలరు? పైగా వారికి ఏమూడు నెలలో, ఐదు నెలలో అసంపూర్తి శిక్షణనిచ్చెదరు. వారును యీ విధానమునందు తమకు మంచియభిప్రాయము లేకున్నను, ఉద్యోగమును నిలబెట్టుకొనుటకు యీ శిక్షణపొందెదరు. దీని వలన నష్టమంతయు వారికే పరిమితమైయుండదు. ఒక విద్యాధికుడు — సామర్థ్యతగలిగిన, వ్యక్తి — యీ శిక్షణ పొందిన వ్యక్తి — దానిని గూర్చి వ్యతిరేక ప్రచారము చేయుచున్నప్పుడా సభలోని శ్రోతలలో ఆ యభిప్రాయములు చిరస్థాయిగా నాటుకొని ప్రజలలోను ఉపాధ్యాయ లోకములోను యింకను దీనియందు హేయ భావము కలుగును.

అసలు విషయమేమన ఈ విద్యనుండలి పరమార్థమును గ్రహించుటకు సహృదయము, విశాలదృష్టి, సత్యాహింసలలో నమ్మకము, దేశాభిమానము, మొదలగు లక్షణములుండవలయును. అవి లేనినాడు యీ విధానముయొక్క ఉత్కృష్టతను గ్రహించుట కడు దుష్కరము.

అధికధరకు కొన్న అతిసన్నని విదేశపుబట్టను ధరించువానికి ఖద్దరు ధారణయొక్క ఆవశ్యకతను గ్రహింపజేయుట యెంతకష్టమో, దౌర్జన్యము ద్వారా భూస్వామ్య వ్యవస్థను రూపుమాపవలయునను వానికి పూజ్యవినోబాజీ భూదానయజ్ఞము యొక్క గొప్పతనమును గ్రహింపజేయుట యెంత కష్టమో, పరాధీన బుద్ధిప్రభావములుగాని, విదేశీయ నాగరికతా వ్యామోహములుగాని, కలిగియున్న వారికి యీ విధానమును గురించి నచ్చచెప్పుటయు నంతే కష్టమైన విషయమే!

నేనుపైన చెప్పినట్లు ప్రచారము జరుగుచున్నప్పుడు యీ శిక్షణపొందిన వారచ్చట యుండుట తటస్థించినచో, వారివాదననెదుర్కొని. ధైర్యముగా వారుచేయు ప్రచారము నిరాధారమని నిరూపించి, దీని గొప్పతనమును తెలియజెప్పుట వారికనీస ధర్మమని గుర్తించవలయును. అందుకు వలయుజ్ఞానమును ప్రతిబేసిక్ విద్యాభిమాని సంపాదించుకొనవలయును.

నేను వెనకటి వ్యాసములో ఆశించినట్లు యీ బేసిక్ విద్యపై డాక్యుమెంటరీ చిత్రములను వివిధ ప్రాంతీయ భాషలలో తయారుచేసి, ప్రదర్శింపజేయుటకు కేంద్రప్రభుత్వము నిశ్చయించుట కడు

# —: తెలుగుసంపద :—

(చెయ్యెత్తి జై కొట్టు తెలుగోడా. అనుకరణ)

1, తెలుగుదేశము నీదె తెలుగోడా తెలుగుసంపద నీదె మొనగాడ
గనులు భూములు నదులు వనము లెన్నో వున్న
పనులు లేకను ప్రజలు పస్తు లున్నారోయ్
కారణము తెలుసుకో తెలుగోడా పాలకుల లోపమని మొనగాడా
2. దేశభాషల కెల్ల తీర్చి దిద్దిన తెలుగుకవితలోనే
దివ్యకావ్యాలు వుండంగ పరభాష నికేల తెలుగోడా
పరుల దోపిడి యేల మొనగాడా
3. కృష్ణ గౌతమి నదులు పొంగి పారుచు నుండ
బంగారు భూముల్లో పంట లెన్నో పండ
పస్తు లున్నావేమి తెలుగోడా నీ హక్కులను సాధించు మొనగాడా
4. ఇట్టి దేశముకొరకు పొట్టిశ్రీరాములూ
ఆంధ్రప్రజకై నేడు ఆత్మబలి యిచ్చెను
ఆశయము సాధించు తెలుగోడా
అమరమూర్తికి శాంతి మొనగాడా

రచన : బళ్ళ అప్పారావు - పెద్దాపురం

(౩౨ వ పేజి తరువాయి)

ప్రశంసనీయము. ఇట్టే వివిధరకములుగా అధికార - అనధికారవర్గముల వారిద్వారా ప్రచారము జరుగుట యవసరము. అట్లని కేవలము ఊకదంపుడు ప్రచారము వలనను లాభముకలుగదు. ఉపాధ్యాయులు యీ విధానము మంచిదని తమ పాఠశాలలద్వారా ప్రత్యక్షముగా నిరూపించవలయును. ఈ విధముగా అక్షరాస్య, నిరక్షరాస్యులలో ప్రచారము జరుగవలయును. ఇందుకుగాను త్వరలో బేసిక్ విద్యయొక్క గొప్పతనమును తెలియజేయు నొక నాటకమును యీ "ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య" ద్వారానే అందజేయవలచితిని - ఇది బేసిక్ విద్యాశిక్షణాలయములలోను, ఉపాధ్యాయ సభలలోను, ప్రదర్శించుట కనుకూలముగా నుండగలదు. ఈ వ్యాసమువలెనే ఆ నాటకమును పాఠకలోకానికి మన "ఆంధ్రరాష్ట్ర ప్రారంభ విద్య" సంపాదక మహాశయు లందింపగలరని యాశించుచున్నాను.

నా వ్యాసములపై పాఠకమహాశయులు తమతమ యభిప్రాయములను యీ పత్రికద్వారా తెలియజేయుదురని యాశించుచున్నాను. మరియు ఇవి చదివిన తరువాత తమకు కలిగిన సందేహములను కూడా తెలియపరచినచో నాయోపిన కొలది ఆ సందేహములకు సమాధానము లీయగలనని పాఠకలోకమునకు తెలియజేయుచున్నాను. మీ సందేహములను మే నెల ౧౦ తారీఖులోపున సంపాదకునకు వ్రాయ ప్రార్థన.

తుదిసారిగా యీ బేసిక్ విద్యావిధాన సత్వర వ్యాప్తికి తమ శక్తికొలది కృషిచేయవలసినదిగా ఉపాధ్యాయులను, అధికారులను, విద్యాభిమానులను, ప్రజాప్రతినిధులను, ఉపాధ్యాయసంఘ నిర్వాహకులను, తదితరులను, కోరుచు బేసిక్ విద్యా వ్యాస ప్రచురణమును ముగించుచున్నాను.

జై హింద్ !

# ప్రాథమిక పాఠశాలలలోని సెలవులు

శ్రీ కె. సిద్ధలింగపిళ్ళ టీచరు - తిరుపతి

ప్రాథమిక పాఠశాలలలో చదువు బాలబాలికలు తక్కువ యీడు (వయస్సు) గలవారుగ నుందురు. వీరికి పాఠములందుకన్న నాటపాటలందు, యితర వ్యాసంగములయందు యెక్కువ ప్రీతియనుట ఎల్ల విద్యావేత్తలకు తెలిసిన విషయమే! కాని యేలో కోయీ పసికూన లభ్యసించెడి ప్రాథమికబడులకు సంవత్సరమునకు 220 రోజులు బడిపనిచేయునట్లు నియమించియున్నారు. సుకుమారమైన పసిపిల్లలు యేపనియందైన నిమగ్నులైనప్పుడు త్వరగా అలసిపోయి, విరామము కోరుచుండుట సైజము. పసిపిల్లలకు సెలవురోజన్న కడుప్రీతి. ఎంతో ఉత్సాహభరితులుగా నుందురు. అట్టిపసికూనలకు కట్టుదిట్టములు (Rules and regulations) పనికిరావు. స్వేచ్ఛయే వారి పరమావధి. వారిసైజస్థితిగతుల కనుగుణముగా విద్యనభ్యసింప జేయుటయే బోధకుల యొక్క బాధ్యత.

ఉన్నత పాఠశాలలందలి విద్యార్థులు వయస్సునందు మీరిన వారుగ నుందురు. తగుకట్టుదిట్టములకు లోనగుదురు. వారు వారి బాధ్యతల(Responsilibities) గుర్తెరిగి ప్రవర్తింతురు. కష్టముల నెదుర్కొనగల ధైర్యసాహసములు వారియందు కలవు. క్లిష్టపరిస్థితులయందు చిన్నబోరు. ఓరిమితో నెక్కువ కాలము పనిచేయగల్గుదురు. విరామము లభింపకపోయినను శ్రమయనక, తమపనిని నిలకడగా చేసి, పూర్తిగావింప గల్గుదురు. ఇట్టి ఉన్నత పాఠశాల విద్యార్థులకు సంవత్సరమునకు 180 రోజులు బడిపనిగా ప్రభుత్వమువారేర్పాటుచేసియున్నారు. ప్రాథమిక, ఉన్నత పాఠశాలల విద్యార్థుల కెంత తేడాయున్నదో అనేకవిధముగ నాయా సంస్థలలో పనిచేయు అధ్యాపకులకును నట్టి వ్యత్యాసమున్నది. వాస్తవమునకు గాఢముగా అవలోకించిన ఉన్నత పాఠశాలలకు సంవత్సరములో 220 రోజులును, ప్రాథమిక పాఠశాలలకు 180 రోజులును బడిపనియుండిన విద్యార్థుల వయోమనస్తత్వముల కనుగుణముగా నుండుననియే మనశ్శాస్త్రజ్ఞులైనను చెప్పకతప్పదు.

పై అంశము లట్లుండ ఇదివరలో ప్రాథమిక పాఠశాలలందుగాని, ఉన్నత పాఠశాలలందుగాని, సంవత్సరములో 1. దసరాశెలవులు (Midterm holidays)2. క్రిస్‌మస్‌సెలవులు3. వేసవిసెలవులు (Summer Vacations)అని మూడువిధములుగా నుండునవి. మన భారతదేశము ప్రజాప్రభుత్వదేశమైన తదుపరి ఉన్నత పాఠశాలలలో దసరా సెలవులను వేసవి (Summer) సెలవులను మామూలుగా నమలు జరుపుచు, క్రిస్‌మస్ సెలవులను తీసివేసి, దానిస్థానే సంక్రాంతి సెలవులను నామముతో వాడుకొనునాచారమై యున్నది.

అయిన కొన్ని జిల్లాబోర్డులు, ఇతరసంస్థలలోగల ప్రాథమిక పాఠశాలలకు దసరా, క్రిస్‌మస్ సెలవులను పూర్తిగా తీసివేసి, వేసవి సెలవులనుమాత్రము నమలుపఱచినవి. మన హిందూసాంప్రదాయముల రీత్యా దసరాసెలవులలో విద్యార్థుల(బాలబాలికల)చే కోలాటముల వేయించుట, బాలికలు బొమ్మల కొలువును నేర్పాటుచేయుట, నాచారమై యుండెడిది. అట్టితరి పసికూనల ఉత్సాహముల నణచిపెట్టి వారికి దశరా సెలవుల నిప్పించక బంధనకు లోనగునట్లుగా చేయుట పరిపాటిగాదు. ఈ పద్ధతిరీత్యా దసరా సెలవులు ప్రాథమిక పాఠశాలల విద్యార్థులకు, ఉన్నత పాఠశాలల విద్యార్థులకన్న అత్యవసరమని ప్రభుత్వమువారును మరియు నాయాసంస్థల వారును, గుర్తెరిగి సదరు దసరాశెలవులను పూర్వమువలె ప్రాథమికబడులకుగూడా వర్తింపజేయవలెనని ప్రార్థన.

ప్రాథమిక పాఠశాలలకు క్రిస్‌మస్ సెలవులను తీసివేసినను, ఉన్నతపాఠశాలలవలె సదరు క్రిస్‌మస్ సెలవులను సంక్రాంతిప్రాధాన్యతనుబట్టి సంక్రాంతి శెలవులను నామముతో వాడుకొను సదవకాశమును నాయాసంస్థలు వారి యాజమాన్యమునగల ప్రాథమిక పాఠశాలలకువర్తింపజేయువలెననికోరి ప్రార్థించుచున్నాను.

(i) కొన్ని సంస్థలకు సంబంధించిన ప్రాథమిక పాఠశాలలు ప్రతిశనివారమును ఉదయం అనగా ½ రోజు పనిచేయుచున్నవి. శనివారములో అర్ధరోజు పని చేయుటను రూపుచేసి, ఉన్నతపాఠశాలలవలె ప్రతి శని, ఆదివారములను శలవు రోజుగా పరిగణించు నవకాశము కల్పించవలెను. (II) ప్రతిసెంటరు క్లాసుమీటింగునకు ఉపాధ్యాయులు హాజరైన నది ఒకబడిరోజు (working day)గా లెక్కించబడును. గనుక ఆరోజు ఉదయం అర్ధరోజు బడిపని చేయవలసిన పనియుండదు. (iii) ప్రాథమిక బడులలో చదువు విద్యార్థులు తక్కువ వయస్సుగలవారు. వేసవి యెండల కోర్చెడి సమర్థత వారికిలేదు కనుక వేసవి సెలవులకు ముందు ఒకనెలను, వెనుక ఒకనెలయు, అనగా ఏప్రిల్, జూన్, నెలలందు ఒంటిపూట బడి (One session School) జరుపుటకును అనుజ్ఞయిచ్చి పై జూపిన సెలవులన్నియు అన్నిసంస్థల యాజమాన్యమున నిర్వహింపబడుచున్న ప్రాథమిక పాఠశాలలకును, ఎయిడెడ్ ఎలిమెంటరీ పాఠశాలలకుకూడా, వర్తింపచేయవలెనని ప్రార్థించుచున్నాను.

N. B :— ఏఅంశములోగాని పైసెలవుల నన్నింటిని వర్తింపజేసికొన్నను సంవత్సరములో బడిరోజులు 220కి తగ్గకూడదను నియమము ఎల్లవారికి విదితమైన విషయమే.

---



---

(౩౮ వ పేజీ తరువాయి)

యమును వివరించగలరు? శ్రీరంగనాథుని మధుర ప్రణయతమకము. గోదాదేవి పాట్లు. యువ్విళ్లూరించు నెల ప్రాయము భగవంతుడు భక్తుని పట్ల చూపు మాయావైఖరి ఘట్టములను సూచించి, పాణిగ్రహణ మహోత్సవమును గూర్చి చెల్లెలికేమని లేఖ వ్రాయదగును? ఇటులనే రాయలసభ, పాండ్య మహాపతిక్లేశము. వీరమునేడు చురకత్తిని గ్రహించుట దృశ్యములను వర్ణించి వినోద, ఖేద, వీర రసము లుప్పతిలునట్లు తమ్మునికి కమ్మ వ్రాయుటయు వలని కాని విషయమే కదా! వ్యాసములలో కడపటిది అసందిగ్ధముగ (Vague) ఊహాతీతమై అందరాకున్నది (IX-3)

ఈ ప్రశ్నాపత్రము నములుటకువీలులేనంత మందముగనుండ సామాన్యదశలోనున్న VIII తరగతి విద్యార్థులు జవాబులు నొసంగుటయెటులు? కనీసము సంఖ్యలో నుత్తీర్ణులు గావించుటకు తగువిధముగా గుణములను పెంచి గత్యంతరములేకుండ కృతార్థులుగ చేసి తీర్చిదిద్దుటయే దయామయులగు విలుత. గట్టువారి కనీసధర్మమని మనవి చేయుచున్నాను




కవిశేఖర, ఓలేటి – రామనాథశాస్త్రి

గీ|| రాయ లొకనాడు వ్రాసిచ్చె ప్రజలకిట్లు
"పిల్లి పెంచినవారల కెల్ల నొక్క-
గోవు దొప్పున నిత్తు; ఆయావు పాలు
పట్టి పెంచెద రెవ్వరో బలియునటుల॥ 1

ఆ|| నెల దినాల పిదప నేపిల్లి ఎవరి మా
ర్జాల మమితమైన లావు గలిగి
యున్న-వారి కిత్తు కొన్ని గ్రామములంచు
దొర వచింప పెంప దొడగి రంత॥ 2

గీ|| రామలింగాఖ్యు డొకడు మార్జాల మొకటి
తెచ్చి- ఆవుపాలన్ని యీ దచ్చుపిల్లి
కిడిన లాభ మదేమి! నే కడుపునిండ
త్రాగిపోయిగా సుఖముంతు భోగగరిమ॥ 3

ఆ|| గడువు దాటగానె పుడమిరే డెల్లర
పిలువ నేనుగూడ వెడలవలయు—
పిల్లి బలియకున్న పీక తీయు నదేమొ
దీని కే ఉపాయమైన గలదె? 4

క|| అని మదిలో దలచియు పిసి
కినపాలన్ మరగ, గాచి గిన్నె కడపు పి
ల్లిని తెచ్చి మూతి యుంచెను
తెనాలి రామన్న యుక్తి తెలిపెగలావో॥

గీ|| రామలింగడు పెంచు మార్జాల మంత
దినదినం క్షయ మొందను అంతలేక—
మూతి కాలుటచే పాలు ముట్టదయ్యె...
నెల గడిచె; నల్లరేగెను నృపతి కడను॥ 6

గీ|| పాలు బాగుగా త్రాగుట వలన నెల్ల
వారి పిల్లు లేన్గులరీతి బలిసియుండె;
రామలింగని యాఖుభుక్ రాజమంతు
పీనుగవలె కానుపించె భూవిభు కనులకు॥

ఆ|| అప్పుడు భూపరత్నమాశ్చర్యపడి "రామ
లింగ; నీబిడాలముం గనుంగొన
పాలు పోయనట్లు స్పష్టమయ్యెడు నీవెట్లు
త్రావినావటోయి గోవుపాలు॥ 8

క|| ఎంతటిమాట మహాప్రభు!
స్వంతముగా నేనె పాలు పట్టుదు క్షీర
మ్మెంతకయిన త్రావదు మతి
మంతులు సేయుడు పరీక్ష మార్జాలమ్మున్ ॥ 9

క|| అని లింగన చెప్పగ పా
లను పిల్లి సమక్షమందు రాజోద్యోగుల్
వినయమున బెట్ట మ్యావ్, మ్యా
వనుచున్ బర్వెత్తె జనము లబ్బురము
పడెన్॥ 10

గీ|| రామలింగని యుక్తి యింకేమి? వేడి
పాలనే పట్టియుంచు నాథ యనుచేత
చల్లనగు పాలనైనను పిల్లి ముట్ట
దయ్యె నను మంత్రి పలికె జనాళి
యెదుట॥ 11

ఆ|| మంత్రి తెలిపి కపుడు మహికాంతు డెంతయు
సంతసించి పిదప సంభ్రమమున
రామలింగని గని ఏమయ్య ఎంతటి
పని యొనర్చినావ నని హసించె॥ 12

# నెలరాజుగర్వం

బాలకవి :
పి. వి. యస్. పాత్రో
పాచిపెంట

1. వెలలేని నెలరాజు! వెన్నెలల రారాజు!
కలువపువ్వుల రాజు! చిలిపినవ్వుల రాజు!

2. కడలిలో పుట్టాడు! గగనాని కెగిరాడు!
నక్షత్రకన్యలతో నాట్యాలు చేశాడు!
మబ్బుమేడలలోన దోబూచులాడాడు!
ఉబ్బిపోతుంటాడు! తగ్గిపోతుంటాడు!

3. శివుని తలపువ్వునై చీకటికి శత్రువై
దీనులకు దివ్వెయై పాపలకు బంధువై
ఇంతింత కన్పించి అంతంతగా పెరిగి
ఆఖరికి కనపడడు అది యేమిగర్వమో?

4. మరునాడు చిఱుతడై మరలకనిపిస్తాడు!
మందహాసము చేసి మమ్మునవ్విస్తాడు!

5. రవి తనకు మిత్రుడని రమతనకు చెల్లెలని
హరి తనకు బావయని యముడు మేనల్లుడని
మింటిమార్గమునందు మిడిసిపడు
తుంటాడు!
కొంటెనవ్వుల తోడ కొరకొరగ చూస్తాడు!

6. విష్ణ్వీశ్వరుఁగాంచి వికవికానవ్వాడు!
అందరికి అతగాడు చందమామా తేను
అల్లుండ్ర బాధలను ఆతడెట్లుసహించు?
కూతుండ్రకో రేటి కోర్కెలెట్లా తీర్చు?

7. ఏది యెట్లాగున్న ఎవ్వ రేమనుకొన్న
జాబిల్లి కూతురిని చక్కగా పెండ్లాడి
నెలరాజు గర్వంబు నేనణచుతానోయ్!
ఆకాశ వీధిలో నాడుకుంటానోయ్!

---

# సన్మానపత్రము

ది 13-4-53 తేదిని గౌరవ. విద్యాశాఖామంత్రి గారగు శ్రీ డాక్టరు,
యం. వి. కృష్ణారావుగారు అరుకులోయ (రామనగర్) దర్శించిన సందర్భమున
అరుకులోయ (రామనగర్) ఆదిమవాసి హాస్టల్ విద్యార్థి బృందము తరఫున
హాస్టల్ ఆహారశాఖామంత్రి, చి॥ లబుసు బొంకయ్య, చి॥ కొర్ర రాజుర్బాబు;
సమర్పించిన సన్మానపత్రము

సీ॥ మల్లవరపువంశ మల్లికా మధువల్లి, కూర్మి మా కొసగిన కుసుమమాల
బీదసాదల నెంతో యాదరంబున బిల్చి, ధర్మ వైద్యము జేయు డాక్టరవు
స్వాతంత్ర్య సమరాన స్వార్థంబు త్యజియించ, పోరంగ దూకిన ధీరుడవు
శారదాంబకు సేవ కోరి సమయము నంతో, పేరు గాంచిన తెనుగు బిడ్డ వీవు
అరయ మంత్రివై నేడు మా అరుకులోయ। కాంచ నేతెంచినావె శ్రీ కృష్ణరాయ!
హర్షమోదాలు కలిగె నియ్యాదరమున। స్వాగతం బయ్య నీకు సుస్వాగతంబు.

ఇట్లు

| | |
|---|---|
| ఆదిమవాసి ప్రాథమికోన్నత పాఠశాల | ఆదిమవాసి విద్యార్థిబృందము అరుకులోయ (రామనగర్) |

తే 14-4-53 మంగళవారం. ఉదయం. 7-30 ని.లకు అరుకులోయ (రామనగర్) శ్రీ ప్రభుత్వముకొండజాతుల పాఠశాలను దర్శించిరి. ఆదిమవసతి విద్యార్థులకు హెచ్చరిక నిచ్చిరి. వసతికి కొంతవరకు ద్రవ్యసహాయము చేయుదుమని వాగ్దానము చేసిరి. బాలురకు తీరిక గల రెండవ పూట ఉపాధ్యాయులు వృత్తివిద్యలు నేర్పవలసినదని హెచ్చరించిరి. ఇచ్చట గల వ్యవసాయ పరిశోధనాఫీసరు గారిని వ్యవసాయ సంబంధమగు వృత్తిని పిల్లలకు నేర్పవలసినదని కోరిరి. ఆదిమవాసి విద్యార్థుల అభివృద్ధి కోరుచున్న యిచ్చటి స్పెషల్ డిప్యూటీ తహశీలుదారు శ్రీ యం. బుచ్చివెంకయ్యగారిని గొనియాడిరి.

| | |
|---|---|
| ఆదిమవాసి ప్రాథమికోన్నత పాఠశాల అరుకులోయ (రామనగర్) | జి. యం. రావ్ ప్రధానోపాధ్యాయుడు. |

# వివేక ప్రశ్నలు

అరయ నాలక్షరముల శివాఖ్య యొప్పు;
వాని తలగొట్ట ఇందిరా వల్లభుడగు;
వాని తలగొట్ట నరంబు పతిక జెలు;
అట్టి పదమేదొ పేర్కొను డార్యులార!
—శ్రీ ఎ. వి. గోవిందరాజా - హెడ్మాస్టరు - తోపుట్టి.

ఒక్కటెటి నామమొప్ప నాలక్షరముల;
ఒకటి మూడును జేర్పంగ నొప్పు వలకు;
చివర రెండును గలుపంగ జెల్లునిక్క;
అట్టి నామంబు వచియింపు డనఘులార!
—శ్రీ డొంకాడ పెదసత్యనారాయణ - అంపావిల్లి.

# ఏప్రిల్ నెల చిత్రప్రశ్నలు

(1958 సం॥ ఏప్రిల్ సంచికలో ప్రకటింపబడిన)

## వివేక ప్రశ్నలు

అను చిత్రప్రశ్నలకు సమాధానములు

౧. మధుర. ౨. చతురంగము.

చందా నెం. రెండు ప్రశ్నలకు సరియైన జవాబులు పంపినవారు

183 కూచిభొట్ల పరశురామశాస్త్రి గారు - హెడ్మాష్టరు - పోలుకొండ
300 కె. సుబ్బయ్యగారు - హెడ్మాష్టరు - మేళ్ళవాగు
572 ఆర్. దివాకరరాజా గారు - టీచరు మేనేజరు - రేగాటిపల్లి
520 టి. రంగయ్య గారు - ఘానిగంగు పేట
310 ఎ. సీతారామస్వామి గారు - హెడ్మాష్టరు - సబ్బవరం
432 పట్నాయకుని సింహాచలంగారు - మేనేజరు - తోడుము
230 రేగడ సత్యనారాయణ గారు - మేనేజరు - కోటిపాం
301 ఎ. వి. గోవిందరాజు గారు - హెడ్మాష్టరు - తోపుదుర్తి
శ్రీమతి గర్భాం అమ్మాజమ్మ - విద్యార్థిని - గర్భాం
కోసులనాటి హనుమచ్ఛాస్త్రి గారు - టీచరు - గంగవరం
173 ఎ. వెంకటరత్నంగారు - టీచరు - శనివారపుపేట
381 భారతుల ఆంజనేయశోభనాద్రిశర్మ గారు - టీచరు శనివారపుపేట
128 బందలుప్పి ధర్మారావుపట్నాయక గారు - టీచరు మేనేజరు - జమ్మిడివలస
315 జి. యమ్. రావ్ గారు - హెడ్మాష్టరు - అరుకులోయ (రామనగర్)
521 శ్రీ బంగారం - ట్రయినింగువిద్యార్థి - అమలాపురం
458 అల్లంరాజా సూర్యారావుగారు - హెడ్మాష్టరు - శృంగవరం
500 వాడ్రేవు శేషగిరిరావు గారు - ట్రయినింగు విద్యార్థి అమలాపురం
534 కె. రామన్నగారు - రిటైర్డుటీచరు - కోడుమూరు
130 తూమల అప్పలనాయుడు గారు - బేసిక్ హెడ్మాష్టరు - వడిమికల్ల
18 భానూరు సత్యనారాయణపట్నాయక్ గారు - హెడ్మాష్టరు - అవలంగి
439 రాయుడు సుబ్రహ్మణ్యంగారు - టీచరు - పి. బండార్లంక
378 పోశల చిన్నచెట్టిగారు - టీచరు - కింతలవానిపేట
401 ఎ. యల్. నరసరాజు గారు - టీచరు - తిమ్మాపురం
541 భోగాపురపు సీతారామస్వామిగారు - హెడ్మాష్టరు - కొట్టక్కి
180 శ్రీ దుంపనారాయణమూర్తి - విద్యార్థి - చింతపల్లి పేట - కోడూరుగనిదరి
150 దుంప రామమూర్తిగారు - టీచరు - చింతపల్లి పేట
335 రాంభాం రామమూర్తిగారు - బేసిక్ టీచరు - పోళ్ళపదం
402 యం. శ్రీరాములుగారు - హెడ్మాష్టరు - దేవరాయపల్లి
538 డొంకాడ పెదసత్యనారాయణగారు - టీచరు మేనేజరు - అంపావిల్లి
270 వి. శ్రీనివాసాచార్యులు గారు - హెడ్మాష్టరు - ఆత్మకూరు
గుండేపూడి హనుమంతరావు - శనివారపుపేట
506 కలిదిండి సత్యనారాయణరాజా గారు - టీచరు - మొయిద

## ఏప్రిల్ నెల చిత్రప్రశ్నలు

## పదపూరణ - సమాధానములు

| | | | |
|---|---|---|---|
| 1. | తల | 6. | తుల |
| 2. | ఈల | 7. | మూాల |
| 3. | తల | 8. | నల |
| 4. | లీల | 9. | మూల |
| 5. | కోల | 10. | శిల |

చందా నెం     సరియైన జవాబులు పంపిన విద్యార్థులు

చి॥ మైచర్ల రంగనాయకులు - 5 వ తరగతి విద్యార్థి - సబ్బవరం
చి॥ పోశల సూకాలయ్య - ప్రయివేటు విద్యార్థి - పెదనాయడుపాలెం
చి॥ లాలం సత్యనారాయణ ,, ,,
చి॥ సబ్బవరపు అచ్చంనాయుడు ,, ,,
చి॥ నారపాడు దేవుడు— ,, ,,
చి॥ సబ్బవరపు స్వామినాయుడు- ,, ,,
చి॥ శ్రీమతి గర్భాం అమ్మాజమ్మ - 1 వ ఫారము - గర్భాం
చి॥ కుప్పిలి కనకరత్నం - 6 వ తరగతి - శంబర
చి॥ దాసరివారి గంగులుకుమారి - 3 వ తరగతి - జమ్మడివలస
521 చి॥ బంగారం - విద్యార్థి - అమలాపురం
560 చి॥ శేషగిరిరావు - విద్యార్థి అమలాపురం
160 చి॥ దుంప నారాయణమూర్తి - విద్యార్థి - చింతపల్లిపేట - కోడూరుగనిదరి
చి॥ యలమంచిలి కోటేశ్వరరావు - 7 వ తరగతి విద్యార్థి - పోలుకొండ

---

## పదపూరణము

(విద్యార్థులు మాత్రమే వీనిని పూరింపవలెను. చందాదారులు కానివారు తప్పనిసరిగా రెండు అణాల తపాలా బిళ్ళలు పంపవలెను. లేనిచో వారిపేర్లు ప్రకటింపబడవు.)

| | పదము | అర్థము | | పదము | అర్థము |
|---|---|---|---|---|---|
| 1 | —— లము | ప్రాతపనిముట్టు | 1 | —— క | పడవ |
| 2 | —— లము | నాగలి | 2 | —— క | గుంపు |
| 3 | —— లము | ఒక ఆయుధము | 3 | —— క | ఒకనాణెము |
| 4 | —— లము | నడత | 4 | —— క | ఒక జంతువు |
| 5 | —— లము | తోక | 5 | —— క | ఒక పురాణ కాంత |
| 6 | —— లము | నునురు | 6 | —— క | పోట్టు |

శ్రీమతి కుప్పిలి కృష్ణవేణి, 6 వ తర- శంబర     శ్రీమతి గర్భాం అమ్మాజమ్మ, 1 వ ఫారం- గర్భాం.

# వింతపదములు - పొడుపుకథలు

[బాలబాలికలారా! ఈ క్రింద కొన్ని వింతపదములు - పొడుపుకథలు ఉన్నవి. వీటి సమాధానాలు చాల గమ్మత్తుగా ఉంటవి. మీరందరూ వీటిని చక్కగా నేర్చుకోండి. మీకు తెలిసిన పొడుపుకథలుంటే వ్రాసి పంపండి. అయితే అవి చాల గమ్మత్తుగా - క్రొత్తవిగా ఉండాలి.]

| పదము | | జవాబు |
|---|---|---|
| హారము కాని హారము | ... | ఆహారము |
| రణము కాని రణము | ... | తోరణము |
| రంగము కాని రంగము | ... | శ్రీరంగము |
| జనము కాని జనము | ... | భజనము |
| వరము కాని వరము | ... | స్థావరము |
| వాటము కాని వాటము | ... | కవాటము |
| గ్రహము కాని గ్రహము | ... | ఆగ్రహము |
| వెల కాని వెల | ... | కోవెల |
| దరువు కాని దరువు | ... | ఆదరువు |
| మఠము కాని మఠము | ... | కమఠము |

—శ్రీమతి ఐ. టి. చిన్నమ్మ - 3 వ ఫారం - గుంటూరు.

| | | |
|---|---|---|
| తీసినకొద్దీ పెద్దదయ్యేది యేది? | ... | గొయ్యి |
| ముక్కున పయనించునది యేది? | ... | బొంగరము |
| గుడినిండ నీళ్ళు గుడికి తాళం | ... | టెంకాయ |
| చెయ్యానికుండ, పొయ్యాని నీళ్లు, వెయ్యాని సున్నం | ... | టెంకాయ |
| సన్నని బట్టలు, తాకితే కంపు | ... | ఉల్లిగడ్డ |
| దేహమెల్ల కన్నులు గలది యేది? | ... | వల |

కూర్పరులు: 1. శ్రీ ఐ. యల్. నరసరాజు. 2. శ్రీ ఐ. అశ్వత్థరాజు.



# ప్రసిడెంటు లేఖ

## మహారాజశ్రీ మదరాసు రాష్ట్ర విద్యాశాఖామాత్యులకు

అయ్యా !

1953 సం॥రము మార్చి 29 తేదీ తెనాలి సాలిపేట హిందూఎలిమెంటరీ పాఠశాలలో తెనాలి తాలూకా టీచరు మేనేజర్లు, వారి పాఠశాలలోని ఉపాధ్యాయులు, నా అధ్యక్షతను సమావేశమై చేసిన తీర్మానముల కాపీని తమకు పంపుతూ, వాటి అవసరమును గూర్చి తమకు తెలియజేయుచున్నాను.

1. టీచింగుగ్రాంటులో సంవత్సరపు మొత్తము గ్రాంటులోనుండి స్కూలు పరిస్థితులపైయిదివరలో యీయబడుతున్న పర్సెంటేజి కట్లను శ్రీప్రభుత్వమువారు తొలగించి. ఏఉపాధ్యాయుని పని అసంతృప్తిగానున్న ఆ ఉపాధ్యాయునకు జరిమానారూపముగ గ్రాంటును కట్టుచేసి మిగిలిన గ్రాంటును యీయవలసినదిగాప్రభుత్వమువారిచే చేయబడినరూలునకుభిన్నముగా ఇన్స్పెక్టింగు ఆఫీసరులు, జిల్లావిద్యాశాఖాధికార్లు పూర్వమువలెనె జనరల్ కట్లనిచ్చుట నేటికిని జరుగుతునేయున్నది. యిది శ్రీప్రభుత్వపు ఉత్తరువులకు భిన్నమగుటచేత దీనిని వెంటనే తొలగించగలందులకు తగిన ఉత్తర్వులను డిపార్టుమెంటుకు యిప్పించవలసినదిగా కోరుచున్నాను.

ఇందులో మరియొక విషయమును గూడ తమదృష్టికి తెచ్చుచున్నాను. ఆయాపాఠశాలల గ్రాంటు పరీక్షకాలమందు విద్యాశాఖాధికారులు తామాస్కూలున కీయదలచిన కోతలను ఏకారణమువలన యీయదలచిరో తెలుపకుండగనే కోతల నిచ్చుచుండుటవలన, సంవత్సరాంతపు గ్రాంటులో రాబడిన లోటు ఏకారణమువలన వచ్చినది. తెలియకుండుట ముందేవిషయమై పాఠశాలా యీజమాన్యము జాగ్రత్త పడవలసినది తెలియకుండుట ఉపాధ్యాయులకు గ్రాంటును పంచునప్పుడెవరికెంతెంత యీయవలయునో తెలియకుండుట సంభవించుచున్నది, కాన శ్రీప్రభుత్వమువారు యీ విషయమై తగిన కట్టుబాట్లు గావించగలందులకు కోరుతున్నాను.

2. ఇన్స్పెను అధికారులు స్కూలురికార్డులో ఒకవిధముగను, తమపైఅధికారులకుపంపుకొనునపుడు మరియొకవిధముగాను, ఇన్స్పెక్షను రిపోర్టును పంపుచుండుటవలన వాస్తవస్థితి తెలియక యాజమాన్యము సంవత్సరాంతపు కట్లతోకూడిన గ్రాంట్లవలన చాలాబాధలు పడవలసి వచ్చుచున్నందున ఇన్స్పెక్షను కాలమందే గ్రాంటులో కోతలనిచ్చుటకు గల కారణములను, పరిమితిని, ఆయా పాఠశాలల రిమార్కుల పుస్తకములలో నమోదుపరచునట్లు చేయుటకు తగిన ఉత్తర్వులను యిప్పించవలసినదిగా ప్రభుత్వమువారిని కోరుతున్నాము.

3. ప్రస్తుతము శ్రీప్రభుత్వమువారిచ్చు 15% మెయింటినెన్సుగ్రాంటు ఏరూపమున వినియోగించినను యాజమాన్యమునకు చాలుటలేదని అనేకవిధములుగా రుజువు చేయవచ్చును. టీచరు మేనేజరు అనువాడొక వంక యాజమాన్యము నొందిన పాఠశాలలోనే తనజీవనభృతికై ఉపాధ్యాయుడుగా కూడా పనిచేయుచుండుటవలననే యీతని ఆర్థికసౌష్ఠవము. స్పష్టమగుచుండ, చాలీచాలకయిచ్చు 15% మెయింటినెన్సు గ్రాంటులలో కోతలనిచ్చుటవలన ప్రయోజనము లేదనియు, ఒకవేళ 15% మెయింటినెన్సుయాజమాన్యపు ఖర్చులకు, యింటెత్తెడు వగైరాలకు సరిపోవునని గాని మిగులునని గాని శ్రీప్రభుత్వమువారు గాని, డిపార్టుమెంటువారు గాని, భావించినచో వారే స్వయముగా అనగా ప్రభుత్వమువారే స్వయముగా ఆయా పాఠశాలల ఖర్చులను భరించి 15% మెయింటినెన్సు గ్రాంటుతో యాజమాన్యమునకు ఎట్టి సంబంధం లేకుండ జేయవలసినదిగా, శ్రీప్రభుత్వము తగిన ఆర్డర్లను యిప్పించవలసినదిగా కోరుతున్నాము.

అయితే అనిబుద్ధి వ్యాపారంగా మాత్రం చేసేవి కాకపోవచ్చు. ఎలా చేసినప్పటికీ అవి అవకతవకలనిపించకపోవు, అలాంటి వాటిని కప్పిపుచ్చుకోటానికై పంతుళ్ళు పరీక్షాధికారులకు తమశక్తికొద్దీ కానుకలు సమర్పించుకొంటూ వుంటారు. ఇదికాస్త ముదురుపాకంలో పడితే లంచగొండితనం అనిపించుకొంటుంది. లేతపాకంలో నేవుంటే అతిథిసత్కారంగా మారిపోయి గౌరవప్రదంగా భావింపబడుతుంది. దీనిలో వున్న తేడా యింతే. అయితే ఈలాంటి సత్కారాలకూ, కానుకలకూ, ముందు పునాదులు త్రొక్కిందెవరో ఆత్మపరీక్ష చేసుకొని తెల్పుకొంటే దీన్నిగురించి అంతగా గొడవచేయవలసినపని వుండదు.

ఈవిషయంలో నాఅనుభవంలో జరిగిన ఒకసంఘటనను గూర్చి వివరిస్తాను. దీన్నిబట్టి నిజానిజాలు ఉపాధ్యాయలోకం నిర్ణయించుకోవచ్చు. నా సహాధ్యాయి ఒకను విద్యాశాఖలో ఇన్‌స్పెక్టింగు ఆఫీసరుగా పనిచేస్తూండేవాడు. నాకూ అతనికీ ప్రాణస్నేహితం. ఒకసారి నేను అతనితో కలిసి ఒక ఎలిమెంటరీస్కూలు ఇన్‌స్పెక్షనుకు వెళ్ళాను, ఇన్‌స్పెక్షనుసమయంలో అక్కడ జరిగిన తంతుచూస్తే నాకు చాల ఆశ్చర్యంవేసింది. నేను కిమ్మనకుండా కళ్ళురెండూ అప్పగించి చూస్తూకూర్చున్నాను, ఇన్‌స్పెక్షను అయిపోయింది. ఆరోజు ఇన్‌స్పెక్షనుకుముందూ, ఆతరువాత ఆపంతుళ్ళు మాకు చేసినసత్కారం ఇచ్చినఅతిథ్యం, జన్మలో మరచిపోలేమని చెప్పవచ్చు, ఒకసవారీబండి కట్టించి మమ్మల్ని సాగనంపారు. మేము ఇంటికొచ్చిన, రెండోరోజునో యేమో ఆస్కూలు హెడ్మాష్టరు ఒకకావడి బరువు కందులు, మిర్చి మూడు తవ్వాలు షుమారు నెయ్యి, పట్టించుకొనివచ్చి, ఏమేమో స్వస్తి వాచకాలు చెప్పి యిచ్చివెళ్ళిపోయాడు.

ఆదృశ్యంచూచేసరికి నాకు వొళ్ళు కంపరమెత్తింది. మంచివాడనుకొన్న నాసహాధ్యాయికూడా లంచగొండిగా మారిపోయినాడా అని మెతో నిస్తుపోయాను. అప్పటికేమీమాట్లాడక భోజనంచేసినతరువాత గదిలో ఒంటరిగా కూర్చున్నప్పుడు అతనితో ఇలా సంభాషణసాగించాను.

నేను—ఏమిరా! ఇన్నాళ్ళనుంచీ నువ్వు నిప్పులాంటివాడవనుకొన్నాను. అయితే నువ్వూకూడా లంచగొండివైనావన్నమాట.

అత—నేటి వ్యవస్థలో కాని వారెవ్వరు? నేనింకాచాలబుద్ధిమంతుణ్ణి సుమా!

నేను—అవును. చాలా బుద్ధిమంతుడవే. ఈలా లంచాలు పుచ్చుకొంటున్నావని ప్రత్యక్షసాక్షిగా నేను రిపోర్టుచేస్తే నీవుద్యోగం పూడిపోదూ?

అత—మంచిప్రశ్న వేశావురా! ఇంతఅమాయకుడ వనుకోలేదు. నన్నువిచారించేఅధికారి బుద్ధిమంతుడైతేగా నాకాభయం?

నేను—అయితే నీపై అధికారికూడా లంచగొండేనంటావా?

అత—కాక మరేమనుకొన్నావు? ఈనాడప్పించిన ముడుపంతా నాకొఅకనుకున్నావేమో కాదు కాదు నాపైవారికోసం, దేవుడిచ్చినంతవరకు నాకు కూడుగుడ్డలకు లోటులేదు, నాజీతం నాకుచాలు. ఏదో పెద్దలు సంపాదించి యిచ్చిన కొండకూడా కొంతవుంది. నాకుయేలోటూలేదు. ఈబీద

పంతుళ్ళను పీడించి తీసుకోవలసిన దుస్థితి నాకేమాత్రం లేదు. అయితే అందరూ మడిగట్టుకొన్నారని చెప్పలేను. కక్కుర్తి పడేవారూ ఉంటారు. ఇదంతా పంతుళ్ళ మెతకతనంవల్ల, అవకతవకలవల్ల కలుగుతున్నదని తెలుసుకో.

నేను—పెద్దపెద్దజీతాలు పుచ్చుకొనే పై అధికార్లకుగూడ లంచాలా! ఇంతకంటె అన్యాయం యేముంది? కంచెయే చేను మేసిన కాపేమిచేయగలడు?

అత—అవును. పేరుగొప్ప వూరుదిబ్బ అన్నట్లు వారుమాత్రం యేంచేస్తారు? వారి పై అధికార్లకు వారుకూడా ముట్టచెప్పాలి ప్రత్యక్షంగానో పరోక్షంగానో. పైనుంచి వచ్చే వొత్తిడిబట్టి, అవసరాన్నిబట్టి, అదంతా క్రిందికి కూడా వ్యాపిస్తుంది. యథారాజా తథాప్రజా అన్నసంగతి నీకూ తెలుసుగా?

నేను—అయితే యీబరువంతా మోసేవి బీదపంతుళ్ళేకదూ?

అత—ఒక్క పంతుళ్ళేమిటి? ఎవరి వాటా ప్రకారము వారు మోస్తుంటారు?

నేను—అయితే దీనికిని వారణోపాయం?

అత—నాదీఅదే ప్రశ్న. అదేమికర్మమో కాని ప్రజాప్రభుత్వంవచ్చిన తరువాతనే యీ లంచాలబాధ మరీయెక్కువయింది. గట్టిగామాట్లాడితే మావాడు యం యల్, ఏ. అని ఒకాయనబెదరిస్తాడు. మావాడు "మాజీమంత్రి" అని ఒకాయన బుకాయిస్తాడు. మరొకాయన "మావాడు మంత్రి అనితెలుసా!" అని జబర్దస్తీ చూపిస్తాడు. వీటికితోడు కులతత్వాలు, పార్టీలు, మొదలైనవి యింకా యెన్నో. వీటన్నింటినీ అధిగమించి న్యాయం పైకి రాలేకపోవుతున్నది ఎక్కడికక్కడికే యేదో ఒకటి అనుకొని న్యాయాన్ని క్రుంగదీస్తున్నవి. ఈరోజుల్లో ముక్కుసూటిగాబోతే మూలబడి అణగారిపోవలసిందే. చట్టప్రకారం నడిస్తే గుక్కెడు మంచినీళ్ళు కూడాపుట్టవు. ఈపంతుళ్ళ విషయంలో రూల్సుప్రకారం వర్తిస్తే ఇంత కఠినాత్ముడు లేడంటారు. ఎవడైనా కాస్త కక్కుర్తిపడితే ఇంత లంచగొండి లేడంటారు. ఏదైనా అవకతవకలు లోటుపాట్లు ఎత్తిచూపినా పైకి వ్రాస్తామన్నా, సంజాయిషీ యివ్వమన్నా, సభలు జరిపి గోలకెత్తుతారు. ఆకాశరామన్న అర్జీలెన్నో పంపుతారు, రాయబారాలు పెళ్ళుతారు. ఏలోటుపాట్లుచూపకస్కూళ్ళన్నీ బాగున్నవని వ్రాస్తేమాత్రం తృప్తికరంగాలేదని ప్రభుత్వం మమ్మల్ని దబాయిస్తుంది. ఈస్థితిలో ఏంచెయ్యాలి? పైవారి హెచ్చరికలు, దబాయింపులు, తప్పకోటానికి అచ్చట వుండే ఉపగ్రహాలకు ఇంత పెట్టాలి. అవసరమైతేవారికి కావలసినవన్నీ సప్లయిచేయాలి. ఇందులోఏదిలోపించినా, ఏదో చెడ్డరిమార్కు రానేవస్తుంది. ఇటుపంతుళ్ళ లోపాలకప్పిపుచ్చి కనికరింతామా పైవారి బాధ, పైవారిని శాంతింపజేతామా బీదపంతుళ్ళగోల. ముందుకుపోతేనుయ్యి—వెనుకకుపోతేగొయ్యి. ఈ బహిరంగరహస్యం అందరికీ తెలుసు. తమలోపాలు కప్పిపుచ్చటానికై పంతుళ్ళు పరీక్షాధికారులకు కానుకలిస్తారు. పైవారి బాధతప్పకోటానికై పరీక్షాధికార్లు పుచ్చుకొంటారు, జవానుదగ్గరనుంచీ, గుమస్తాద

గలిగినంచీ, అందరూ పుచ్చుకోనేవాళ్ళే. ఈ పుచ్చుకోటాలు మామూళ్ళక్రిందచలామణి అయిపోతున్నవి. ఇలాటిమామూళ్ళు అన్ని డిపార్టుమెంట్లలోను పాతుకపోయి వున్నవి. గవర్నమెంటు భూమిశిస్తు మాదిరిగా ఇవి ప్రతియేటా చెల్లుబడి కావలసినవే. ఈవ్యవస్థ అంతామారాలంటే శాసనాలవల్ల ప్రయోజనంలేదు. శాసనాలు ఎక్కువైనకొద్దీ ఇవిపెరిగి పోతూనే వుంటాయి. కాబట్టి యీలాటి మార్పు రావాలంటే ప్రజానీకంలో, అధికారవర్గంలో, పరిపూర్ణమైన మానసిక పరివర్తనం కలగాలి. స్వార్థరహితమైనసేవ, త్యాగబుద్ధి ప్రతివ్యక్తిలో పెంపొందాలి. వ్యక్తిగత క్షేమాన్నిగాక, సాంఘిక క్షేమాన్ని, దేశ క్షేమాన్ని, కులమతవర్గరహిత బుద్ధితో అందఱూకాంక్షించాలి. ఇట్టిసద్వ్యవస్థ ప్రజానీకంలో ముందుగా కుదురుకోటానికి త్యాగశీలురైన ఉపాధ్యాయులే ముందడుగు వేయాలి. దేశం బాగుపడవలెనన్నా, అనుగున బడిపోవలెనన్నా, ఉపాధ్యాయులే కారకులౌతారు. అయితే యీ సత్యసూత్రాన్ని ప్రజలు, ప్రభుత్వం, గుర్తించి ఉపాధ్యాయలోకాన్ని తగినంత ఆర్థికగౌరవ ప్రతిపత్తులతో ఉన్నతస్థానానికి తేవాలి. అప్పుడే దేశకళ్యాణం – ధర్మసంస్థాపనం – జరుగుతవి. ఉపాధ్యాయుడు ఉసూరుమంటే దేశమాత కన్నీరు విడుస్తుంది. ధర్మదేవత కుంటుతుంది. ఈ బహిరంగ రహస్యాన్ని ప్రజలు, ప్రభుత్వం, ఎంతత్వరగా గుర్తిస్తే దేశానికి అంతమంచిది. అదీకాక రాజకీయ స్వాతంత్ర్యంతోపాటు ఆర్థిక స్వాతంత్ర్యం కూడ మనకులభించినప్పుడే దేశానికికళ్యాణం. నీప్రశ్నకు ఇదేనాసమాధానం. అంతటితో మాసంభాషణ ఆగిపోయింది. ఒక్కదీర్ఘ నిశ్వాసం విడిచి నాసహాధ్యాయి వీపుతట్టి "నీవిప్పుడు నిజమైన పరీక్షాధికారివి" అని అతణ్ణి ప్రశంసించాను.

దీన్నిబట్టి విద్యాశాఖలో పెరుగుతున్న లంచగొండి తనానికి మూలకారకులెవరో, దాన్ని నిర్మూలించుట యెట్లాగో, ఉపాధ్యాయులే విచారించి నిర్ణయింప వలెనని మాప్రార్థన.

— సంపాదకుడు.

౪౩ వ పేజీ తరువాయి

4. టీచరు మేనేజర్ల పాఠశాలలో పనిచేయుచున్న ఉపాధ్యాయులకు మేనేజిమెంటువారిచ్చునట్లు చూపింపబడుతున్న రు [illegible]-0-0 లు. వాస్తవముగా యివ్వనట్టిది కాదనిన్ని, అట్లిచ్చునట్లు ఎక్విటెన్సు మొదలగు రికార్డులలో చూపింపబడుట కేవలము తమతమ యాజమాన్యములకును, ఉపాధ్యాయవృత్తికిని, ప్రభుత్వమువారిచే రాబోవునని భావింపబడుతున్న కష్టనష్టములకు లొంగియే. తప్పుడు ఎకౌంట్లను, టీచరు మేనేజరు పాఠశాలల యాజమాన్యాలు గావించుచుండిరనియు, నిష్పాక్షికముగా సాక్ష్యక్కిగ తాభిప్రాయమును తమకు తెలియజేయుచున్నాను: అందువలన వాస్తవము కాని యీవిషయమై ఉపాధ్యాయులకును, ఉపాధ్యాయ యాజమాన్యులకును, అనవసరపు వ్యవహారములను కలుగునట్లు చేయక దరిద్రనారాయణులగు యాజమాన్యోపాధ్యాయము లిచ్చుచున్నారని ప్రభుత్వమువారు భావించి యూరకుండక ఆ రు 30-0 లను కూడ ప్రభుత్వమువారే భరించి, ఉపాధ్యాయుల కీయవలసినదిగా శ్రీ ప్రభుత్వమువారని కోరుతున్న యీ తీర్మానముతో పూర్తిగా యేకీభవించి శ్రీ ప్రభుత్వమువారికి తెలియజేయుచున్నాను.

ఇట్లు తమ విశ్వాసపాత్రుడు,
కంచిభొట్ల శివరామయ్య, ప్రెసిడెంటు.

వక పాలు త్రాగిన ఆవును పారద్రోలిన విధముననే బేసిక్ విద్యావిధానమును అనుటు సరదాచున్నారని ముచ్చటించిరి. తరువాత వివిధ వినోదములు, రాత్రి 10 గం॥ నుండి నాటకము, సభా నిర్వాహకులు శిక్షణాలయపు విద్యార్థులచే ప్రదర్శింపబడెను. శిక్షణాలయములో తయారైన వివిధ వస్తువుల ఖాదీ వస్త్రాలు ప్రదర్శింపబడెను. కొంత ఖద్దరు గూడ పురజనులు ఖరీదు చేసిరి.

భీమునిపట్నం,
డి 20—4—1953.

వేలంపూడి గోపాలరావు,
సారస్వతమంత్రి, బేసిక్ ట్రైనింగ్ స్కూలు.

ఈ రేంజి ఉపాధ్యాయులు 41 మంది శ్రీ ఎ. కాశీపతిరావు (పాచిపెంట B. H E. S. హెడ్మాష్టరు) గారి ఆర్గనైజింగున పాలూరు ముఖ్య పట్టణములో ప్రథమ చికిత్స కేంద్రాన్ని స్థాపించిరి. అధ్యాపకులుగా శ్రీ డాక్టరు జి. సన్యాసరావు M. B. B. S గారిని యెన్నుకొనిరి. శ్రీ C H. V. సుబ్రహ్మణ్యం B. A. B. E D (పాలూరు రేంజి D. I. S. గారు పర్యవేక్షణ గావించిరి. శ్రీ డాక్టరు వై జె. పాల్, L. M. P. గారు ఏప్రెలు 18-19 తేదీలలో పరీక్ష చేసిరి. 19వ. తేదీ తేనీటివిందులో పలువురు ప్రముఖులు ఉపన్యసించిరి. సభలో పాచిపెంట కా॥ బాలకవి : శ్రీ పి వి యస్. పాత్రో గారు రచించిన పద్యములు చదువబడెను. 19వ. తేదీతో శిక్షణకేంద్రం ముగించబడెను.

పాలూరు,
డి 23—4—53

బి. పరమేశ్వరరావు
విద్యాశాఖవిలేఖరి.

## తాడిమర్రిబోర్డు ప్రాథమికోన్నతపాఠశాల ద్వితీయ వార్షికోత్సవము

ఈ పాఠశాల ద్వితీయ వార్షికోత్సవము 23-4-53 తేదీన ఉదయము పతాకారోహణము మొదలైన కార్యక్రమముతో ప్రారంభింపబడెను. సాయంత్రము 3 గం॥లకు పాఠశాలవద్ద అనంతపురం జిల్లాబోర్డు విద్యాశాఖాధికారులైన శ్రీ వి. పి. నారాయణరెడ్డిగారు అధ్యక్షులుగాను శ్రీ బి. వి. సుబ్బయ్యగారు (ధర్మవరం రేంజి స్కూల్సు డిప్యూటి ఇన్‌స్పెక్టరు) ప్రారంభోపన్యాసకులుగాను. యుండి సభను ఛత్తువటము గావించిరి.

— ఎ. నంజుండప్ప టీచరు, తాడిమర్రి.

## బొబ్బిలి ఉంగరాలవీధిస్కూలు - వార్షికోత్సవము

1953 వ సం॥ ఏప్రిల్ 11, 1' తేదీలలో బొబ్బిలి ఉంగరాలవీధి ఎయిడెడ్ ఎలిమెంటరీస్కూలు వార్షికోత్సవము అతివైభవముగా జరిగినది. సభ మొదటిరోజున శ్రీ R. S. ప్రకాశరావు M. A. L. T. (Tutor Kirlampudi Palace) గారి అధ్యక్షతను, రెండవదినమున శ్రీ R. జోగారావు B.A.L.T (Retired head master, Board Highschool Palakonda) గారి అధ్వర్యమున జరిగినది. సభకు పలువురు - పుర ప్రముఖులు హాజరైరి. విద్యాభివృద్ధినిగోరి పలువురు పెద్దలుపన్యసించిరి. అభివృద్ధి బొందుచున్న యీ స్కూలుకు బడితావులు "చాలకపోవుట" గుర్తించి, స్థలాభివృద్ధికై ఒక ఉపసంఘము నేర్పాటుచేసిరి. తరువాత నేటి ప్రజాస్వామిక పరిపాలన లెట్లున్నవో తెలియజేయు అసెంబ్లీ సమావేశం అను ప్రదర్శనమును, శ్రీకృష్ణ "రాయబారము" అను నాటకమును, విద్యార్థులు మిక్కిలి చక్కగా ప్రదర్శించిరి. అధ్యక్షుని అంత్యోపన్యాసానంతరము ప్రదర్శనములలో పాల్గొన్న బాలబాలికలకు బహుమతులు పంచిపెట్టబడి అభినందనములతో సభ ముగింపబడినది.

బొబ్బిలి,
2-5-1953.

పి. రామగోపాలం,
హెడ్మాష్టరు & మేనేజరు.

ANDHRA RASTRA PRARAMBHA VIDYA
Regd. M.N. 3766 Vol. 42. - No. 2



Edited by Sri M. Venkata Ratnam Garu, B. A., & Printed and Published by Sri E. Venkaiah Garu at his Pattabhirama Press, Eluru.